# అథ షోడశో%ధ్యాయః

# దేవాసుర యుద్ధము

సనత్కుమార ఉవాచ |

పునర్దైత్యం సమాయాతం దృష్ట్వా దేవస్సవాసవాః | భయాత్ప్ర కంపితాస్సర్వే సహైవాదుద్రువుర్ద్రుతమ్ || 1

వైకుంఠం ప్రయయుస్సర్వే పురస్కృత్య ప్రజాపతిమ్ | తుష్టువుస్తే సురా నత్వా స ప్రజాపతయో%ఖిలాః || 2

సనత్కుమారుడిట్లు పలికెను -

మరల అచటకు మచ్చిన ఆ రాక్షసుని గాంచి ఇంద్రాది దేవతలందరు భయముతో వణుకుతూ శీఘ్రముగా పలాయనమును చిత్తగించిరి (1). వారందరు బ్రహ్మగారిని ముందిడు కొని వైకుంఠమునకు వెళ్లి నమస్కరించి స్తుతించిరి (2).

దేవా ఊచుః |

హృషీకేశ మహాబాహో భగవన్ మధుసూదన క్ష నమస్తే దేవదేవేశ సర్వదైత్య వినాశక || 3

మత్స్యరూపాయ తే విష్ణో వేదాన్నితవతే నమః | సత్యవ్రతేన సద్రాజ్ఞా ప్రలయాబ్ధి విహారిణ || 4

కుర్వాణానాం సురాణాం చ మంథనాయోద్యమం భృశమ్ | బిభ్రతే మందరగిరిం కూర్మరూపాయ తే నమః || 5

నమస్తే భగవన్నాథ క్రతవే సూకరాత్మనే | వసుంధరాం జనాధరాం మూర్ధతో బిభ్రతే నమః || 6

వామనాయ నమస్తుభ్యముపేంద్రాఖ్యాయ విష్ణవే | విప్రరూపేణ దైత్యేంద్రం బలిం ఛలయతే విభో || 7

నమః పరశురామాయ క్షత్రనిః క్షత్ర కారిణ | మాతుర్హితకృతే తుభ్యం కుపితాయాసతాం ద్రుహే || 8

రాయాయ లోకరామాయ మర్యాదాపురుషాయ తే | రావణాంతకారాయాశు సీతాయాః పతయే నమః || 9

దేవతలిట్లు పలికిరి -

ఇంద్రియములకు ప్రభువైన వాడా! హేభగవాన్! గొప్ప బాహువులు గలవాడా! మధువు అను రాక్షసుని సంహరించిని వాడా! దేవదేవా! ఈశ్వరా! రాక్షసుల నందరినీ నశంపజేసినవాడా! నీకు నమస్కారము (3). హే విష్ణో! సత్యవ్రతుడనే పుణ్యశీలుడగు రాజుతో గుడి ప్రలయ కాలమునందు మత్స్యరూపముతో సముద్రమునందు విహరించి వేదములను కాపాడిని నీకు నమస్కారము (4). సముద్రమును మథించుటకు దేవతలు పెద్ద యత్నమును చేయుచుండగా కూర్మరూపమును దాల్చి మందరపర్వతమును మోసిన నీకు నమస్కారము (5). హే భగవాన్! నాథా! యజ్ఞవరాహరూపమును దాల్చి జనులకు ఆధారమైన బూమిని శిరస్సుపై ధరించిన నీకు నమస్కారము (6). హే ప్రభో! వామనావతారములో నీవు ఇంద్రుని సోదరుడవై బ్రహ్మణ వేషముతో రాక్షసరాజైన బలిని మోసగించి బ్రహ్మాండమునంతనూ నీ అడుగులతో వ్యాపించినవు. అట్టి నీకు నమస్కారము (7). పాపులను సంహరించు నీవు పరశురాముడవై తల్లి హితము కొరకు క్రోధముతో భూమియందు క్షత్రియులు లేకుండగా చేయుటకు ఉద్యమించితివి. అట్టి నీకు నమస్కారము (8). లోకుల మనస్సులను రంజింప చుయువాడు, మర్యాదాపురుషోత్తముడు, సీతాపతి అగు రాముని రూపమును దాల్చి రావణుని సంహరించిన నీకు నమస్కారము (9).

నమస్తే జ్ఞానగూఢాయ కృష్ణాయ పరమాత్మనే | రాధావిహారశీలాయ నానాలీలాకారాయ చ || 10

నమస్తే గూడదేహాయ వేద నిందాకరాయ చ | యోగాచార్యాయ జైనాయ బౌద్ధరూపాయ మాపతే || 11

నమస్తే కల్కిరూపాయ మ్లెచ్ఛానామంత కారిణ |
అనంతశక్తిరూపాయ సద్ధర్మ స్థాపనాయ చ || 12

నమస్తే కపిలరూపాయ దేవహూత్యై మహాత్మనే | వదతే సాంఖ్య
యోగం చ సాంఖ్యాచార్యాయ వై ప్రభో || 13

నమః పరమహంసాయ జ్ఞానం సంపదతే వరమ్ | విధాత్రే
జ్ఞానరూపాయ యేనాత్మా సంప్ర సీదతి || 14

వేదవ్యాసాయ వేదానాం విభాగం కుర్వతే నమః | హితాయ
సర్వలోకానాం పురాణరచనాయ చ || 15

ఏవం మత్స్యాదితనుభిర్భక్త కార్యోద్యతాయ తే | సర్గస్థితిధ్వంస కర్త్రే
నమస్తే బ్రహ్మణ ప్రభో || 16

జ్ఞానస్వరూపుడవు, పరమాత్మవు అగునీవు శ్రీకృష్ణరూపమును దాల్చి, రాధతో గూడి విమరిస్తూ అనేక లీలలను వెలయించితివి. అట్టి నీకు నమస్కారము (10). ఓ లక్ష్మీ పతీ! జినరూపములో, బుద్ధరూపములో నిగూఢమగు అవతారమును దాల్చిన నీవు వేదములను నిందించి యోగాచార్యుడవైతివి. అట్టి నీకు నమస్కారము (11). అనంతశక్తి స్వరూపుడవగు నీవు కల్కి రూపమును దాల్చి మ్లెచ్ఛుల నంతమొందించి సద్ధర్మమును స్థాపించెదవు. అట్టి నీకు నమస్కారము (12). ఓ ప్రభూ! మహాత్ముడగు కపిలుని రూపము దాల్చి సాంఖ్యాచార్యుడవై సాంఖ్యయోగమును దేవహూతికి బోధించిన నీకు నమస్కారము (13). ఏ జ్ఞానముచే అంతఃకరణము మిక్కిలి ప్రసన్నమగునో అట్టి పరమజ్ఞానమును బోధించువాడు, సృష్టిస్థితిలయకర్త, జ్ఞానస్వరూపుడు అగు పరమహంసకు నమస్కారము (14). సర్వజనుల హితమును గోరి వేదములను విభజించి పురాణములను రచించిన వేదవ్యాసుడు నీ స్వరూపమే. అట్టి నీకు నమస్కారము (15). ఓ ప్రభూ! ఈ తీరున నీవు మత్స్యాది అవతారములను దాల్చి భక్తుల కార్యమును చేయుటకు సంసిద్ధుడ వగుచుందువు. సృష్టిస్థితిలయములకు కారణమైన పరబ్రహ్మవు నీవే.నీకు నమస్కారము (16).

ఆర్తిహంత్రే స్వదాసానాం సుఖదాయ శుభాయ చ | పీతాంబరాయ హరయే తార్క్ష్యయానాయ తే నమః |

సర్వక్రియాయైక కర్త్రే శరణ్యాయ నమో నమః || 17

దైత్యసంతాపితామర్త్య దుఃఖాదిధ్వంసవజ్రక |
శేషతల్పశయాయార్క చంద్రనేత్రాయ తే నమః || 18

కృపాసింధో రమానాథ పాహి నశ్శరణాగతాన్ | జలంధరేణ దేవాశ్చ స్వర్గాత్సర్వే నిరాకృతాః || 19

సూర్యో నిస్సారితస్థానా చ్చంద్రో వహ్నిస్తథైవ చ |
పాతాలాన్నాగరాజశ్చ ధర్మరాజో నిరాకృతః || 20

విచరంతి యథా మర్త్యాశ్శోభంతే నైవ తే సురాః | శరణం తే వయం ప్రాప్తా వధస్తస్య విచింత్యతామ్ || 21

తన దాసుల కష్టములను పోగొట్టి సుఖములను, శుభములను ఇచ్చువాడు, పచ్చని వస్త్రమును ధరించువాడు, పాపములను పోగొట్టు వాడు, గరుడుడు వాహనముగా గలవాడు అగు నీకు నమస్కారము. క్రియలన్నిటినీ చేయు ఒకే ఒక కర్తవు నీవే. శరణు పొందదగిన నీకు అనేక నమస్కారములు (17). దైత్యులచే పీడింపబుడచున్న దేవతల దుఃఖములు మొదలగు వాటిని నశింపచేయుటలో వజ్రము వంటి వాడా! శేషశయ్యపై పరుండు వాడవు, సూర్యచంద్రులు నేత్రములుగా గల వాడవు అగు నీకునమస్కారము (18). దయానిధీ! లక్ష్మీపతీ! శరణు పొందిన మమ్ములను రక్షించుము. జలంధరుడు స్వర్గమునుండి దేవతల నందరినీ వెళ్లగొట్టినాడు (19). సూర్యచంద్రులను, అగ్నిని, యమధర్మరాజును అతడు తమ తమ స్థానములనుండి వెళ్లగొట్టినాడు. పాతాళమునుండి వాసుకిని తరిమివేసినాడు (20). మానవులు వలె తిరుగాడు చున్న దేవతలలో శోభ అంతరించినది. మేము నిన్ను శరణు పొందుచున్నాము. వానిని వధించు ఉపాయమును ఆలోచించుము (21).

సనత్కుమార ఉవాచ|

ఇతి దీనవచశ్శ్రుత్వా దేవానాం మధుసూదనః | జగాద కరుణా సింధు ర్మేఘ నిర్హ్రాదయా గిరా || 22

సనత్కుమారుడిట్లు పలికెను -

దేవతల ఈ దీనాలాపములను విని కరుణా సముద్రుడగు మధుసూదనుడు మేఘంగంభీరమగు వాక్కుతో నిట్లనెను (22).

విష్ణురువాచ |

భయం త్యజత హే దేవా గమిష్యామ్యహమాహవమ్ | జలంధరేణ దైత్యేన కరిష్యామి పరాక్రమమ్ || 23

ఇత్యుక్త్వా సహసోత్థాయ దైత్యారిః భిన్నమానసః | ఆరోహద్గరుడం వేగాత్కృపయా భక్త వత్సలః || 24

గచ్ఛంతం వల్లభం దృష్ట్వా దేవై స్సార్ధం సముద్రజా | సాంజలిర్బాష్పనయానా లక్ష్మీర్వచనమబ్రవీత్ || 25

విష్ణువు ఇట్లు పలికెను -

ఓ దేవతలారా! భయమును విడనాడుడు. నేను యుద్ధయునకు వెళ్లి, జలందరాసురునకు నా పరాక్రమమును చూపించెదను (23). భక్త ప్రియుడు, రాక్షసశత్రువు అగు విష్ణువు ఇట్లు పలికి దయచే దుఃఖితమైన మనస్సు గలవాడై శీఘ్రముగా గరుడుని అధిష్ఠించెను (24). సముద్రపుత్రియగు లక్ష్మి దేవతలతో గూడి వెళ్లుచున్న తన భర్తను గాంచి కన్నీళ్లతో చేతులను జోడించి ఇట్లు పలికెను (25).

లక్ష్మ్యువాచ |

అహం తే వల్లభా నాథ భక్తా యది చ సర్వదా | తత్కథం తే మమ భ్రాతా యుద్ధే వధ్యం కృపానిధే || 26

లక్ష్మి ఇట్లు పలికెను -

ఓ నాథా! నేను నీకు ప్రియురాలనైనచో, నేను ఎల్లవేళలా నీకు భక్తురాలనైనచో, ఓ దయాసముద్రా! నా సోదరుని నీవు యుద్ధములోపెట్లు వధించగల్గుదువు? (26).

విష్ణురువాచ |

జలంధరేణ దైత్యేన కరిష్యామి పరాక్రమమ్ | త్రైస్సంస్తుతో గమిష్యామి యుద్ధాయ త్వరితాన్వితః || 27

రుద్రాంశసంభవత్వాచ్చ బ్రహ్మణో వచనాదపి | ప్రీత్యా చ తవ నైవాయం మమ వధ్యో జలంధరః || 28

విష్ణువు ఇట్లు పలికెను -

జలంధరాసురునకు నా పరాక్రమమును చూపించెను. దేవతలు కొనయాడుచుండగా శీఘ్రముగా యుద్ధము కొరకు వెళ్లగలను (27). కాని రుద్రుని అంశ##చే జన్మించిన వాడగుట వలన, బ్రహ్మ యొక్క వచనము వలన, మరియు నీ అనురాగము వలన జలంధరుడు నాచే వధింపబడడు (28).

సనత్కుమార ఉవాచ |

ఇత్యుక్త్వా గరుడారూఢశ్శంఖచక్ర గదాసి భృత్ | విష్ణుర్వేగాద్య¸° యోద్ధుం దేవైశ్శక్రాదిభిస్సహ || 29

ద్రుతం స ప్రాప తత్రైవ యత్ర దైత్యో జలంధరః | కుర్వన్ సింహరవం దేవైర్జ్వలద్భి ర్విష్ణుతేజసా || 30

అథారుణానుజ జవ పక్షవాత ప్రపీడితాః | వాత్యా వివర్తితా దైత్యా బభ్రముః ఖే యథా ఘనాః || 31

తతో జలంధరో దృష్ట్వాదైత్యాన్ వాత్యాప్రపీడితాన్ | ఉద్ధృత్య వచనం క్రోధాద్ద్రుతం విష్ణుం సమభ్యగాత్ || 32

ఏతస్మి న్నంతరే దేవాశ్చక్రుర్యుద్ధం ప్రమర్షితాం | తేజసా చ హరేః పుష్టా మహాబలసమన్వితాః || 33

యుద్ధోద్యతం సమాలోక్య దేవసైన్యముపస్థితమ్ |
దైత్యానాజ్ఞాపయమాస సమరే చాతిదుర్మదాన్ || 34

సనత్కుమారుడిట్లనెను-

విష్ణువు ఇట్లు పలికి శంఖమును, చక్రమును, గదను, కత్తిని చేతబట్టి గరుడునిపై నెక్కి ఇంద్రాది దేవతలతో గూడి యుద్ధమునుచేయుట కొరకు శీఘ్రమే వెళ్ళాను (29). విష్ణువు యొక్క తేజస్సుచే కాంతిని పొందిన దేవతలతో గూడి సింహనాదమును చేస్తూ, విష్ణవు జలంధరాసురుడు ఉన్న స్థలమును శీఘ్రముగా చేరుకొనెను (30). అపుడు గరుడుని రెక్కల గాలిచే పీడించబడిన రాక్షసులు ఆకాశమునందలి మేఘములు తుఫానుయందు వలె గిరగిర తిరుగుచుండిరి (31). అపుడు జలంధరుడు రెక్కల సుడిగాలిచే రాక్షసులు పీడింపబడుటను గాలిచే ఎగురవేయబడుటను గాంచి కోపించిన వాడై శీఘ్రమే విష్ణువుపై దాడి చేసెను (32). విష్ణువు యొక్క తేజస్సుచే ఉత్సాహితులైన దేవతలు మహాబలమును పొంది అదే సమయమలో యుద్ధమును చేయనారంభించిరి (33). యుద్ధమునకు సన్నద్ధమై విచ్చేసిన దేవసైన్యమును గాంచి జలంధరుడు మహాబలశాలురగు రాక్షసులను యుద్ధమునకు ఆజ్ఞాపించెను (34).

జలంధర ఉవాచ |

భో భో దైత్యవరా యూయం యుద్ధం కురత దుస్తరమ్ |
శక్రాద్యైరమరై రద్య ప్రబలైః కాతరైస్సదా|| 35

మౌర్యాస్తు లక్షసంఖ్యాకా ధౌమ్రా హి శతసంఖ్యకాః | అసురాః కోటి సంఖ్యాతాః కాలకేయాస్తథైవ చ || 36

కాలకానాం దౌర్హృదానాం కంకానాం లక్ష సంఖ్యయా | అన్యే%పి స్వబలై ర్యుక్తా వినిర్యాంతుమమాజ్ఞయా || 37

సర్వే సజ్జా వినిర్యాత బహుసేనాభి సంయుతాః | నానాశస్త్రాస్త్ర సంయుక్తా నిర్భయా గతసంశయాః || 38

భో భో శుంభనిశుంభౌ చ దేవాన్ సమరకాతరాన్ | క్షణ న సుమహావీర్యౌ తుచ్ఛాన్నాశయతంతం యువామ్ || 39

జలంధరుడిట్లు పలికెను -

ఓ రాక్షసవీరులారా! బలశాలుడు, కాని పిరికి వారునగు ఇంద్రాది దేవతలతో మీరు భయంకరమగు యుద్ధమును చేయుడు (35). లక్షమంది మౌర్యులు, వందమంది దౌర్హృదులు, కోటిమంది కాలకేయాసురులు (36). లక్షమంది కంకులు మరియు ఇతరులు తమసైన్యములతో గూడి నా ఆజ్ఞచే బయలుదేరెదరు గాక! (37). మీరందరు వివిధ వస్త్రములను, అస్త్రములను దోడ్కొని, సంశయములను విడనాడి నిర్భయులై, పెద్దసైన్యమును వెంటబెట్టుకొని సన్నద్ధులై బయలుదేరుడు (38). ఓ శుంభనిశుంభులారా! మహావీరులగు మీరిద్దరు యుద్ధమునకు భయపడే నీచులగు దేవతలను క్షణకాలములో నాశనము చేయుడు (39).

సనత్కుమార ఉవాచ|

దైత్యా జలంధరాజ్ఞప్తా ఇత్థం యుద్ధవిశారదాః | యుయుదుస్తే%సురాస్సర్వే చతురంగబలాన్వితాః || 40

గదాభిస్తీక్ష బాణైశ్చ శూలపట్టిశ తోమరైః | కేచిత్పరశు శూలైశ్చ నిజఘ్నుస్తే పరస్పరమ్ || 41

నానాయుధైశ్చ పరైస్తత్ర నిజఘ్నుస్తే బలాన్వితాః | దేవాస్తథా మహావీరా హృషీకేశబలాన్వితాః || 42

యుయుధు స్తీక్ష బాణాశ్చ క్షిపంతస్సింహవద్రవాః | కేచిద్బాణైస్సు తీక్ష్ణైశ్చ కేచిన్ముసలతోమరైః || 43

ఇత్థం సురాణాం దైత్యానాం సంగ్రామస్సమభూన్మహాన్ | అత్యుల్బణో మునీనాం మి సిద్ధానాం భయంకారకః || 44

ఇతి శ్రీ శివమహాపురాణ రుద్రసంహితాయం యుద్ధఖండే దేవయుద్ధ వర్ణనం నామ షాడశో%ద్యాయః (16)

సనత్కుమారుడిట్లు పలికెను-

యుద్ధనిపుణులగు ఆ రాక్షసులందరు జలంధరునిచే ఇట్లు ఆజ్ఞాపించబడిన వారై చతురంగ సైన్యముతో గూడి యుద్ధమును చేసిరి (40). దేవదానవులు గదలతో, పదునైన బాణములతో, శూలములతో, పట్టిశములతో, తోమరాయుధములతో, గొడ్డళ్లతో, శూలములతో ఒకరినొకరు సంహరించుకొనిరి (41). హృషీకేశుని సన్నిధిచే బలమును పొందియున్న మహావీరులగు దేవతలు కూడ ఇతరములగు వివిధాయుధములతో రాక్షసులను సంహరించిరి (42). దేవదానవులు సింహనాదములను చేస్తూ వాడి బాణములను ప్రయోగిస్తూ, మరియు రోకళ్లతో తోమరాయుధములతో యుద్ధమును చేసిరి (43). ఈ తీరున దేవదానవులకు గొప్ప సంగ్రామము జరిగెను. అత్యుగ్రమగు ఆ యుద్ధము మునులకు సిద్ధులకు భయమును కలిగించెను (44).

శ్రీ శివమహాపురాణములోరుద్రసంహితయందలి యుద్ధఖండలో దేవాసురయుద్ధ వర్ణన మనే పదునారవ అధ్యాయము ముగిసినది (16).